శ్రుతి స్మృతి పురాణానాం ఆలయం కరుణాలయం ।
నమామి భగవత్పాద శంకరం లోక శంకరం ॥

# వివేక చూడామణి

## Introduction :- (మంగళాచరణమ్)

1) సర్వవేదాంత సిద్ధాంత గోచరం తమగోచరమ్ ।
గోవిందం పరమానందం సద్గురుం ప్రణతోస్మ్యహమ్ ॥ 1 ॥

→ ఈ text చెప్పే topic - వివేకం, ప్రస్థాన త్రయ భాష్యం లలో, ఇంకా ఇన్ని ప్రకరణ గ్రంథాలలో శంకర భగవత్పాదుల బోధ యొక్క సారాంశం వివేకము

→ వివేకం అంటే ఏమిటి? - Eg :- తిల తండుల న్యాయము (నువ్వులు - బియ్యం), నీరక్షీర న్యాయము (పాలు - నీలు). ఒకటి seperate చేసేందుకు కలగా పులగం అయిపోయిన సందర్భంలో విడదీయడం - వివేకం.

→ జీవితం లో విలువైనవి, విలువ లేనివి, లేదా ముఖ్య విలువైనవి, విలువ తక్కువవి ఈ రెండింటినీ seperate చేయటం తెలిసుండాలి

→ Eg :- పాయసం - with Coffe powder - ఇరకంగా mixup, కలగా పులగం, తప్పుగా మనం Mixup చేసేస్తే వాటిని మనం seperate చేయటం కష్టం అయిపోతుంది. కనుక seperate చేయాల్సిన సందర్భంలో seperate చేయగలగాలి. ఆ వివేకం లేనిదే జీవితం చాలా తప్పు దారిలో పోతుంది

→ ధర్మాధర్మ వివేకం :- Eg :- డబ్బు సంపాదించటం, ధర్మాన్ని పాటిస్తూ సంపాదించాలి కానీ మనసుని weakness వల్ల కోసం అధర్మాన్ని అయినా ఆచరిస్తాం అంటే వివేకం లోపించినది. ధర్మాధర్మ వివేకం లోపించినది. అది మొదటిదైన వివేకం. కానీ ఇక్కడ చెప్పేది ధర్మాధర్మ వివేకం కాదు. ఇక్కడ చెప్పేది ఏమి ఉంటుందంటే, ఇంకొక వివేకం. ఈ ధర్మ, అధర్మ వివేకం ధర్మ శాస్త్ర గ్రంథాలలో చెపుతారు. కొన్ని సందర్భాలలో ఏది భక్తి, ఏది కాదు అనేది కూడా అవసరమే

→ Eg :- దేవుడి పూజ పేరు చెప్పి పశుపక్ష్యాదులను హింస చేయటం - తప్పు

→ ఆత్మానాత్మ వివేకం అని ఒకటి కలదు వేదాంతం లోకి వచ్చినప్పుడు. ఆత్మ అంటే తాను. ఇప్పుడు నేను అని మీరు అన్నప్పుడు ఆ నేను భావనకే ఆత్మ అని పేరు. నేను భావన మీరు ఎరుగుదురా! తెలుసుకదా.

Suppose నేను భాష తెలియని వారు ఎవరైనా చేయి ఎత్తండి అని అంటే ఎవరైనా చేయి ఎత్తితే నేను భాష తెలిసి ఎత్తినట్టా? తెలియక ఎత్తినట్టా? కనుక నేను భాష తెలిసినవాడు ఈ సృష్టిలో ఎవడూ ఉండడు

→ ఈ నేను అనగానేమి? ఇదే పెద్ద సమస్య. కాబట్టి నేను - నేను కాదు. Barber shop కి వెళ్ళేముందు జుట్టుని నేను అనుకుంటాడు. ఎప్పుడైతే వెళ్లి వచ్చాక ఆ జుట్టుని నేను అని అనుకోడు. ఈ నేను దగ్గర ఉన్నంత కలగాపులగం ఇంక ఎక్కడా లేదు సృష్టిలో. నేను అనేది ఏమిటి? అనే విషయాన్ని లోకానికి బోధించడానికి ఒక రమణ మహర్షి అవసరం అయినాడు. అంతటి confusion/mix up/ కలగాపులగం. అలాంటి పొరపాటు మనం చేస్తూ ఉంటాం.

→ నేను అనగానేమి అనేది తెలుసుకోవటం అది వేదాంత శాస్త్రం యొక్క మౌలికమైన విషయం. మరి జగత్తు తెలియనక్కర లేదా? అంటే నేను తెలియకుండా జగత్తుని మీరు తెలుసుకొనుట అది సంభవమే కాదు. మీకు తెలిసింది అనుకున్న జగత్తు తెలియుటయే కాదు. అదంతా అజ్ఞానమే. నేను తెలిసిన తరువాతనే మీకు సరియైన పద్ధతిలో జగత్తు తెలుస్తుంది. మరి దేవుడి మాట ఏమిటి? అంటే నేను తెలియకుండా దేవుణ్ణి తెలియుట కూడా సంభవం కాదు. కొందరు చాలామంది దేవుడు తెలుసు అని చెప్తున్నారు అంటే, వాళ్ళు చెప్పే దేవుడు అది యదార్థం అయిన దేవుడు కాదు. నేను తెలియని వాడు చెప్పే దేవుని లక్షణములు వాడి మనస్సు నుంచి కల్పితమైనవే అవుతాయి తప్ప యదార్థంగా ఉండదు.

→ కాబట్టి నేను గురించి తెలుసుకునుట వేదాంత శాస్త్రం. అంటేనే దీనికి ఆత్మ విద్య అని పేరు. ఆత్మ అంటే తాను. నేను - ఆత్మ

→ ఇప్పుడు మీరు ఆలోచించి చెప్పండి, మీరు నిద్ర లేస్తూనే నేను, ఈశ్వరుడు, జగత్తు మూడు ఉంటాయిగా. నిద్ర లేస్తూనే మొట్ట మొదట నేను వస్తుంది. తరువాత జగత్తు వస్తుంది. మనం ఈశ్వరుణ్ణి తెచ్చుకునే ప్రయత్నం చేస్తాం. సం నేను - జగత్తు - ఈశ్వరుడు: వరుస లోకంలో జనులు నేను గురించి వదిలేసి మిగతా రెండింటి గురించి తెలుసుకుంటారు

→ నన్ను తెలియకుండా మీరు జగత్తుని వేరుగా భావన చేసినా దాంట్లో వివేకం కొరవడుతుంది. తప్పుని ఒప్పుగా, ఒప్పుని తప్పుగా భ్రమ పడే అవకాశం ఉంటుంది. దాన్ని అవివేకం అంటారు భ్రమ. అలాగే దేవుడి విషయంలో కూడా ఆత్మ స్వరూపం గురించి సరిగా తెలియకుండా దేవుడి విషయం లో ఏవేవో భావన చేయుటం వలన మతంలో కూడా ఎంతో కొంత దోషం వస్తుంది. కాబట్టి ఈ దోషం లని అన్నింటినీ మనం తప్పించుకొని శుద్ధంగా ఉండాలి అంటే ఆత్మ స్వరూపంలో విషయంలో చాలా జాగ్రూకతతో తెలివి తేటలతో, పరిశీలన తో, శోధనతో మనం వివేకం ని సంపాదించి ముందుకు అడుగు వేయాల్సి ఉంటుంది.

→ అంచేతనే మనిషి జీవితానికి మూలము "వివేకము"

→ ప్రపంచ జీవనం లో ధర్మాధర్మ వివేకం కావాలి. తన స్వరూపం విషయంలో ఆత్మ, అనాత్మ వివేకం. కలిగి ఉండాలి అలాగే ఈశ్వర స్వరూపము ఏట్టిది? ఏది యదార్థము, ఏది కల్పితము అనే వివేకం ఉండాలి ప్రతి సందర్భంలోనూ వివేకం ఉండాలి

→ చీకటిగా ఉన్నపుడు వస్తువులు అన్నీ అలికేసినట్టుగా కనపడుతాయి తప్ప, వేరేగా కనపడవు. అపుడు చేయాల్సిన పని దీపం వేయుటం. ఇంట్లో పనులను చక్కబెట్టు కోవాలంటే మొదట దీపం ఉండాలి. అలాగే జీవితమును చక్కబెట్టుకోవాలి అంటే వివేకం అనే దీపం ఉండవలెను. వివేకం లేని జీవితం చీకటి గదిలో పనులు చేసుకునుట వంటిది. వివేకం లేని శిరస్సు అది శిరస్సే కాదు. శిరస్సుకి ఆభరణం ఏది? - వివేకం. Hair style కాదు/చూడామణి కాదు

→ మనకి కావలసిన చూడామణి - వివేకం. వివేకం ఉన్న శిరస్సు ల మనిషి జీవితాన్ని సఫలం చేయటమే కాకుండా ఇతరులను కూడా సహాయం చేయగలుగుతారు.

→ శ్లోకం - సర్వవేదాంత సిద్ధాంత గోచరం, (తమగోచరం) - తం - అగోచరం, గోవిందం, పరమానందం, సద్గురుం ప్రణతో:, అస్మి, అహం.

→ ఇక్కడ గోవిందునికి నమస్కారం చేస్తున్నారు. గోవిందుడు అంటే జ్ఞాన స్వరూపుడయిన పరమాత్మ కు నమస్కారం. గోవిందుడు అంటే శ్రీకృష్ణుడు

→ శ్రీ కృష్ణుడు ÷ రాధాకృష్ణుడు (→ పురాణ) – గీతాకృష్ణుడు (→ జ్ఞాన స్వరూపుడైనటువంటి శ్రీకృష్ణునకు)
నేను నమస్కరిస్తున్నాను.

→ శ్రీ కృష్ణుడు ఆనంద స్వరూపుడు. ఆయన యొక్క స్వరూపము ఆనందము. రాముని స్వరూపం ధర్మం.

→ ఆనందం అంటే ఇంద్రియములతోటి విషయములకు కలిగే సంపర్కం వల్ల కలిగే ఆనందం Eg:- food, cent, etc. అటువంటి ఆనందములు చాలా అల్పమైనవి కొద్ది సేపు ఉండి పోతాయి. అవి ఆనందం గా పరిగణలోకి రానే రావు. ఆనందం అంటే మన స్వరూపమే ఆనందం. అది శాశ్వతమైన ఆనందం. అటువంటి ఆనందాన్ని పరమానందం అంటారు. ఇంద్రియ భోగంలో ఉండే సుఖం వేరు స్వరూపంలో అనుభవానికి వచ్చే ఆనందం వేరు.

→ ఇంద్రియ సుఖములలో లభించే సుఖము బంధ హేతువు. సంసారం లో మనల్ని బంధిస్తుంది. అనేక రకాలుగా బంధిస్తుంది. whereas స్వరూపం లో వచ్చే ఆనందం అది మనిషిని సంసార బంధం నుండి విముక్తున్ని చేస్తుంది ఆ ఆనందం అది పరమాత్మ యొక్క స్వరూపం

→ పరమాత్మ అంటే ఏమిటో తెలుసునా? ఇప్పుడు మీకు ఆనందం పొద్దున కావాలా, మధ్యాహ్నం కావాలా, సాయంత్రం కావాలా? ఎల్లప్పుడూ కావాలి office లోనా ఇంట్లోనా - అన్ని దేశాలలో, సర్వ వస్తువులని ఆస్వాదించేటప్పుడు, అన్ని సంబంధాలలో, ఆనందం తెలుస్తూ ఉండాలి, స్వతంత్రమై ఉండాలి అటువంటి ఆనందం. - దానికే మరో పేరు - దేవుడు. ఉపాసన కోసం దేవాలయాలలో అలా ఉంటాడు.

→ దేవుని స్వరూపం ఏమిటంటే సకల పరిచ్ఛేదములకు అతీతమైన అంటే ఈ conditions అన్నింటినీ దాటి ఉండే ఆనందమే దేవుని స్వరూపం
→ అటువంటి ఆనందం. దాన్ని పరమ అంటారు. పరమానందం. ఎటువంటి పరిచ్ఛేదములు - అంటే Breaks. ఎటువంటివి లేని ఆనందం. అది పరమాత్మయే. అదే శ్రీకృష్ణుడు అంటే. ఇప్పుడు చెప్పండి శ్రీకృష్ణుడు ఎక్కడ ఉంటాడు? బయట? లోపల?. లోపల ఉంటాడు. అనుభవానికి వచ్చేదే లేదో, ఉండేది మాత్రం లోపలే. కాబట్టి "గోవిందం పరమానందం"

→ "అహం ప్రణతోస్మి" - నేను నమస్కారం చేస్తున్నాను.

→ ఈ ఆనంద స్వరూపుడైన పరమాత్మ కంటికి కనపడతాడా? కనపడడు. అగోచరం. ఉపాసకుల సౌకర్యం కొరకు ఈశ్వరునికి ఒక రూపాన్ని మహర్షులు కల్పించారు. అంటేనే కంటికి కనపడదు - అగోచరం

Eg:- Electricity, ఆకాశం, గురుత్వాకర్షణ శక్తి... చూడండి, ఆకారం లేనివి ఎన్ని మీరు అనుభవంలోకి వస్తున్నాయి. వీటికి ఆకారం లేదుగా. లేకపోతే మనకు ఏమన్నా ఇబ్బంది వచ్చిందా? వాటిని మీరు అర్థం చేసుకోలేకపోతున్నారా? వాటిని వాడుకుంటున్నారు, అర్థం చేసుకుంటున్నారు

→ మట్టి, నీరు, వాయువు, అగ్ని - వీటికి వేటికి రూపం లేదు. చూడండి రూపం లేనివి, కంటికి కనిపించనివి ఎన్ని ఉన్నాయి. చిత్రం ఏమిటంటే కంటికి కనిపించటం లేదు. కానీ అనుభవంలోనే ఉన్నాయిగా. మనం సుఖం అనుభవానికి వచ్చినప్పుడు, దుఃఖం అనుభవానికి వచ్చినప్పుడు దానికి ఏ రూపం ఉండదు. పరమేశ్వరుని రూపం ఉండదు.

→ రామునికి, కృష్ణునికి రూపం మనం భావన చేయవచ్చు తప్ప రాముని యొక్క స్వరూపం ఏమిటో దానికి రూపం ఉండదు పరమాత్మకి రూపం ఉండదు అగోచరం. రూపం లేని ఈ పరమాత్మని ఎలాగ తెలుసుకోవాలి?

→ ఉపనిషత్తులలో చెప్పిన సిద్ధాంతములను (సత్యమును శోధన చేసి నిష్కర్షగా చెప్పినది) గనక మనం అధ్యయనం చేస్తే, అప్పుడు నేను భగవంతుని తెలుసుకుంటాను. రూపం లేదు కాబట్టి తెలియదు అని అనుకోవద్దు.

Eg:- Electricity Book చదువుకుంటే దాని గురించి తెలుస్తుంది.

→ రూపం లేనివాడు అయిన పరమాత్మ, ఉపనిషత్ సిద్ధాంతములని జాగ్రత్తగా అధ్యయనం చేస్తే తెలుసుకోగలుగుతారు. అటువంటి పరమాత్మని నేను నమస్కారం చేస్తున్నాను

→ అహం :- నేను, సర్వ వేదాంత సిద్ధాంత గోచరం - సకలములైన ఉపనిషత్తుల యొక్క సిద్ధాంతముల యందు తెలియబడునట్టియు, అగోచరం - కంటికి కానరానట్టియు, పరమానందం - అఖండ ఆనంద స్వరూపుడైనట్టియు, సద్గురుల - హృదయంలో ఆత్మ రూపంగా ప్రకాశించునట్టియు, ఎందుకంటే ఆత్మయే సద్గురువు

లేదా ఇంకో అర్థం - మంచి విషయములను బోధించే గురువు అయినట్టి
(శ్రీకృష్ణుడు మనకి గురువు - భగవద్గీత) గోవిందం - శ్రీకృష్ణ భగవానుని
లేదా గోవింద భగవత్పాదులను, ప్రణత: అస్మి - తలవంచి నమస్కరిస్తున్నాను
→ శ్రీకృష్ణుడు - భగవద్గీతను బోధించిన సద్గురువు, ఆత్మ రూపంగా
హృదయంలో ప్రకాశించే సద్గురువు.
→ సద్గురువు అంటే ఉపనిషత్ సిద్ధాంత బోధ చేసే సద్గురువు. అది బయట
లోపల ఉండే సద్గురువు ఆత్మ చైతన్యస్వ. అదియే పరమాత్మ కూడ.
అటువంటి సద్గురువు నకు నేను నమస్కారం చేస్తున్నాను.
→ లేదు అంటే ఆ. ఆ గోవిందుని అంటే మాటలతో వర్ణింప శక్యం
కాని గోవిందుని నేను నమస్కారం చేస్తున్నాను. లేక శబ్దంతో చెప్పాలంటే
అర్థం అది కంటితో కనపడేది కాదు. ఆ ఉపనిషత్తులలో చెప్పబడిన
పరమాత్మను నేను నమస్కారం చేస్తున్నాను.

(బ్రహ్మనిష్ఠా మహాత్మ్యము)

జంతూనాం నరజన్మ దుర్లభమత: పుంస్త్వం తతో విప్రతా
తస్మాద్వైదిక ధర్మ మార్గపరతా విద్వత్త్వమస్మాత్పరమ్।
ఆత్మానాత్మ వివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితి:
ముక్తిర్నో శతకోటిజన్మసు కృతై: పుణ్యైర్వినా లభ్యతే॥ 2॥

→ జంతూనాం - నరజన్మ - దుర్లభం - అత: - పుంస్త్వం - తత: -
విప్రతా - తస్మాత - వైదిక ధర్మ మార్గ పరతా - విద్వత్త్వం - అస్మాత్ - పరం -
ఆత్మానాత్మ వివేచనం - స్వనుభవ: - బ్రహ్మాత్మనా - సంస్థితి: - ముక్తి: -
నో - శతకోటి జన్మసు - కృతై: - పుణ్యై: - వినా - లభ్యతే
→ జంతూనాం = పుట్టే ప్రాణులకు, నరజన్మ = మానవుడై పుట్టుట,
దుర్లభం = చాల కఠినము,
→ ప్రాణులన్నీ పుట్టినవే, - చెట్లు, క్రిములు, కీటకాలు, పక్షులు -- మానవులు.
పుట్టే ప్రాణులన్నింటిలో మానవుడై పుట్టుట చాలా గొప్పది. అది
మొట్ట మొదటి step. ఇది గొప్ప విషయం - మానవుడై పుట్టుట

→ కాబట్టి మానవ జన్మ యొక్క వైశిష్ట్యాన్ని అర్థం చేసుకోవాలి. ఎందుకంటే జీవితం అనగా ఏదో ఒక Degree సంపాదించి, ఒక ఉద్యోగాన్ని సంపాదించి/ ఏదో Business పెట్టికొని ధనాన్ని సంపాదించి. ఇక అక్కడితో జీవితంలో నేను చేయాల్సిన పనులన్నీ settle అయిపోయినాయి. ఈ పైన అలా యాంత్రికంగా ధనమును సంపాదించుట భోగములను అనుభవించుట, తరువాత Retire అవటం. కొద్దో గొప్పో చిన్ని పుణ్యం ఏదో చేయటం - తీర్థయాత్ర ఏదో చేసి ఇక స్వర్గానికి Ready గా ఉండటం ఇదేనా జీవితం అంటే? life అంటే ఇంతేనా, ఇంతకు మించి లేదా life లో? ఇంత విశిష్టమైన ప్రాణము, మనుష్య జన్మ దీనికి ఎంతో విలువ గలదు. దాన్ని అలా ముగించటం ఎంత దురదృష్టకరం.?

→ Life అంటే ఒక circle లోపల పరిచ్ఛిన్నమైన జీవితాన్ని గడిపేసి దేహత్యాగం చేసేయటం అది కాదు life అంటే. life అంటే చాలా విస్తారం గలదు. ఉదా:- ఆ చెట్లు, పక్షుల కిల కిల రావములు, చెట్లు ఊగులాడుట, పక్షుల ఎగురుట, పూవులు సువాసించుట, గడ్డి మొలుచుట అన్నీ కూడా life ఏ.

→ తరువాత మానవుడికి అనేక సుఖములు - దుఃఖములు ఉంటాయి. ఎన్నో ఇబ్బందులు కష్టాలు వస్తుంటాయి. సంయోగం - వియోగం - కరుణ - దయ - ప్రేమ - అసూయ - ఈర్ష్య, ద్వేషము ఇవన్నీ కూడా life లో భాగమే. కనుక ఆ life యొక్క విస్తృతి చాలా గొప్పది. దాన్ని మీరు గుర్తించండి అని ఆరంభం చేస్తున్నారు. జంతూనాం నరజన్మ దుర్లభం.

→ అతః = ఈ మానవ జన్మ కంటే, పుంస్త్వం = మగవాడై పుట్టుట - దుర్లభం

→ మనుషులు రెండు రకాలుగా ఉన్నారు - పురుషులు, స్త్రీలు. ఇంట్లో అప్పుడే పురుష అహంకారం కనపడుతుంది అని అనుకోవద్దు. ఒక ప్రేమ భావమే గలదు అలా అనటంలో. ఎందుకంటే ఇది వేదాంతం ఇది. కబడ్డీ లాంటిది అమ్మాయిలు కబడ్డీ ఆడితే అంత బాగోదు. వైరాగ్యం గలిగిన వాడు సన్యాసం తీసుకొని Road మీద పడుతాడు. ఒక Bowl పట్టుకొని వీళ్ళదగ్గర, వాళ్ళదగ్గర తిరుగుతాడు. ఎక్కడో పడుకుంటాడు. ఆ రకంగా గడుస్తుంది. ఇది పురుషుడికి తేలిక, స్త్రీకి తేలికా?

→ ఆ కాలం యొక్క పరిస్థితి బట్టి అలా చెప్పవచ్చు. ఇప్పుడు స్త్రీలు కూడా రావచ్చు ఏది చెప్పినా, కొన్ని విషయములలో పురుషుడికి ఉన్న సౌకర్యము స్త్రీలకు లేదనో తక్కువ అనో చెప్పక తప్పదు.

→ ఒక advantage కూడా స్త్రీ కంటే.
→ తతః = దాని కంటే, విప్రతా = విప్రుడై పుట్టుట, లేకపోతే విప్రుడు అగుట,
దుర్లభతా - కఠినము.
→ మగవాడై ఉండుట ఒక advantage. దాంట్లో కొంత కఠినత, అది లభించటం
గొప్ప విషయం. దానికంటే గొప్ప విషయం వాడు విప్రుడు అగుట. విప్రుడు
అనగా ఎవరో తెలుసా మీకు?
→ జన్మనా జాయతే శూద్రః = అందరూ పుట్టుక చే శూద్రులై ఉంటారు
సంస్కారేణ ద్విజః = ఉపనయన సంస్కారం చేస్తే ద్విజుడు అనబడును.
వేదాధ్యయనేన విప్రత్వం = వేదాధ్యయనం చేసినట్లయితే వాడు విప్రుడు
బ్రహ్మ జ్ఞానేన బ్రాహ్మణః = బ్రహ్మ జ్ఞానం పొందితే బ్రాహ్మణుడు
అనబడతాడు.
→ కాబట్టి మానవుడై పుట్టి - అది గొప్ప. మానవులలో పురుషుడై పుట్టుట, పురుషుడై
పుట్టినంత మాత్రాన సరిపోదు. వాడు వేదాధ్యయన సంపన్నుడగుట మరింత కఠినము.
వేదాధ్యయనం కఠినమైన పని. అందుచేతన అది కఠినము అని చెప్పారు.
→ తస్మాత్ = దానికంటే, వైదిక ధర్మ మార్గ పరతా = వేదముల యందు
చెప్పబడిన, ధర్మము యొక్క దారికి కట్టుబడి ఉండుట దుర్లభం.
→ వేదం వల్లించవచ్చు, కానీ ఆ వల్లించిన వేదమంత్రముల యొక్క అర్థం
తెలుసుకొని, ఆవేదం లో చెప్పిన ధర్మములు బుద్ధికి తెచ్చుకొని ఆ ధర్మ మార్గానికి
కట్టుబడి జీవించటం అనేది మరింత కఠినము, మరింత దుర్లభము.
→ అస్మాత్ = దీనికంటే, విద్వత్త్వం = పండితుడై ఉండుట, పరం = గొప్పది
→ వేదం చదువుకున్నాడు, వేదంలో చెప్పినట్టుగా అగ్నిహోత్రము మొదలుగు
కర్మలని చేస్తుంటాడు. కానీ పాండిత్యం ఏమీ ఉండదు. ఆ మంత్రాలకి అర్థం
ఏమీ తెలియదు. చేస్తున్న కర్మ యొక్క వైశిష్ట్యము తెలియదు. ఎందుకు
చేస్తున్నాడో తెలియదు. అలా చాలామంది ఉన్నారు కాబట్టి చేయటం తప్ప
ఎందుకు చేస్తున్నాడో తెలియదు. ఇక ముక్తి పట్టుకోవటం ఎందుకు?
→ అంటే అర్థం ఏమిటి? విద్వత్త్వం ఉండదు. కర్మ చేయటమే అభ్యాసం
ఉంటుంది తప్ప, ఆ పాండిత్యం, ఆ జ్ఞానం, విషయమంతా తెలిసి ఉండుట

అటువంటి విద్యత్త్వము, అంటే ఆ జ్ఞానమును కలిగి ఉండుట మరింత కఠినము
→ ఆత్మానాత్మ వివేచనం = ఆత్మను, అనాత్మను విడివిడిగా తెలియుట
అప్పుడే వివేకం లోకి వచ్చినాం. వివేచనం చేయుట మరింత కఠినము.
→ సాధారణంగా జనులు ఇది ఆత్మ, ఇది అనాత్మ అనే తేడా తెలియకుండానే
బ్రతికేస్తూ ఉంటారు. జనులు అలా ఉంటారు.
→ ఈ వివేకం లేకపోవుట అనేది పెద్ద సమస్య. ఆరోగ్యం విషయంలో వివేకం
లేకపోవుట చే కారణంగా జనులు అనారోగ్యంతో సతమతమవుతూ ఉంటారు
కేవలం వివేకం లేకపోవటం చేత. చిన్న ఉదాహరణ. Eg: బెల్లం, పంచదార,
oil roasted/ steam cooked, దంపుడు బియ్యం/ మిల్లు పట్టిన బియ్యం,
బియ్యంతో/ గోధుమతో, వెన్న/ నెయ్యి, etc
→ ఎప్పుడూ sofa లో కూర్చోవటమా, లేదంటే ఇటు అటు చలాకీగా
తిరగటం మంచిదా? ఇలాగ ఆ వివేక జ్ఞానం మనకు బుద్ధియందు ఎప్పుడూ అలా
మెదలుతూ ఉండటం, ప్రకాశిస్తూ ఉండటం ఎంత కఠినమైన విషయం?
→ Eg: Doctors అయి ఉండి కూడా ఆరోగ్య సూత్రాలు పాటించకపోవటం.
వివేకం అనేది చాలా కఠినమైన విషయం. 5 steps దాటి వివేకంలోకి వచ్చాం
→ ఇక్కడ చెప్పిన వివేకం ఏది ఆత్మ, ఏది కాదు? ఇంతకీ ఆత్మ అంటే ఏమిటి?
** → ఒకసారి నిలకడగా కూర్చొని కళ్ళు అలవోకగా మూసి, Meditation ధ్యానం చేయాలి
"నేను, నేను, నేను - అహం - నేను" ఇప్పుడు మెల్లగా కళ్ళు తెరవండి. ఇప్పుడు
మీకు ఒక అనుభవం కలిగింది కదా. కళ్ళు మూసుకున్నా కలిగింది కదా. అంటే కళ్ళు
మూసిన చూడచ్చన్నమాట. దేన్ని చూశారు. మిమ్మల్ని మీరే చూశారు. మీ అనుభవం
మీకు కలిగినది. నాకేమి అనుభవం కలిగిందంటే నా యొక్క అనుభవం కలిగినది. ఆ
నేను అనేది ఏమిటి? దానికి ఏదో రూపమా, పదమా, మనసులో 2 F లాంటి
లేక మీ "అంతరాంతరముల యందలి అనుభవమా?"
** → ఆ అంతరాంతరముల యందలి అనుభవము - ఏది అనుభవము? తన యొక్క
అనుభవము తనకు కలిగే తన యొక్క అనుభవము. ఇతరముల యొక్క అనుభవం
కూడా కలుగుతుంది Eg: కళ్ళు తెరిచి సినిమా చూస్తే ఒక తేడాగల అనుభవం
కలుగుతుంది. ఆ అనుభవం కాదు. తన యొక్క అనుభవం. దానికి ఆత్మ అని పేరు
ఆత్మను నేను అని మీరు అనువాదం చేయవచ్చును.

→ ఆ నేను అంటే ఏమిటో తెలియాలి. నేను అంటే తెలియకుండా ఉంటుందా? దేవుడంటే తెలియదు, అమెరికా అంటే తెలియదు నేను అంటే తెలియకుండా ఉంటున్నదా ఎవ్వరైనా? ఉంటుంది

→ మిమ్మల్ని ఎవరైనా అడిగితే, నేను Gopal అని అంటే. నేను తెలిసిందా? తెలియలేదు. ఎందుకంటే. నామకరణం చేయకముందు ఉన్నా? పేరు తెలియని ముందు కూడా ఉన్నాను పేరు ఇతరులు పెట్టింది. ఏది ముందు Gopal ముందా, నేను ముందా? నేను ముందు. కాబట్టి నేనుకి ఆత్మానుభవము సహజమైన ఉన్న నేను అనే అనుభవమును తరువాత ఎవరో పెట్టిన పేరుకు జోడిస్తే అనాత్మ అయిపోయింది నేను. పేరు ఆత్మ కాదు. కాబట్టి పేరు ఆత్మ కాదు అని ఎంత మందికి తెలుసు? చూసారా దీంట్లో ఎంత ఇబ్బంది ఉంది. నేను తెలియక పోవటం ఏమిటి? అని అనుకున్న మనుష్యులు, అదిలోనే పొరపాటు.

→ Eg:- I am the husband of this lady. వివాహానికి ముందు ఆత్మ లేదా? ఉంది వివాహానికి ముందు ఉంటే ఈ ఆత్మ భర్త ఎందుకు అయింది భర్త అనేది తరువాత వచ్చింది. ఆత్మ ముందే ఉన్నది. కాబట్టి

→ తరువాత వచ్చి పోతుంది కూడా. వచ్చినవన్నీ పోవాల్సిందేను. మరోలా అహంకారం. అన్నీ పోతాయి. ముందో వెనకో, అన్నీ పోయేవే, కానీ వీడు మాత్రం ఉంటాడు. ఈ ఆత్మ మాత్రం ఉంటుంది. ఈ ఆత్మకి ఎన్ని అనాత్మలని జోడించుకుంటూ పోతున్నారో చూసారా? కాబట్టి నేను ఆమెకి భర్తను. అంటే భర్త అనాత్మ, నేను ఆత్మ. తండ్రి, కొడుకు, అన్నీ అనాత్మ.

*→ ఒక తండ్రి కొడుకుని నువ్వు నా కొడుకువి కావు అని అన్నాడు. వాడికి నాన్న అదే బాగానే ఉంది అని అన్నాడు. చూడండి ఈ అనాత్మను తీసివేయటం అంత సరళం. అలా వస్తుంది ఇలా పోతుంది నేనుని తీసివేయగలరా?

Eg:- ఒకాయన సన్యాసం పుచ్చుకున్నాడు. సన్యాసానికి ముందు ఉన్న title అన్నీ పోయాయి. అలా నిలబడి ఉన్నాడు. నేను మాత్రం ఎక్కడికి పోదు. సన్యాసం తీసుకున్న తరువాత కూడా నేను అలాగే ఉంటుంది. ఆ నేనుకి ఆత్మ అని పేరు

→ నేను అనే అనుభవము - ఆత్మ. ఈ నేను అనే అనుభవానికి మరల ఆత్మ కానివాటిని వేటిని వేటినో జోడిస్తూ ఉంటారు అవన్నీ అనాత్మ

→ Eg:- ఒకాయన నేను లక్షాధికారిని అన్నాడు. ఎక్కడ ఉన్నాయి లక్ష, Bank లో.
Bank లో ఉన్న లక్ష రూపాయలు ఆత్మ అవుతుందా, అనాత్మ అవుతుందా? అనాత్మ
మరి నేను లక్షాధికారిని అని అంటాడేమిటి? ఆత్మని, అనాత్మని కలగాపులగం
చేసాడు కదా?

→ వీడు నేను తప్పు మరేమి కాదు. ఇది ప్రధానమైన సందేశం. కాబట్టి
ఈ రకంగా మనుష్యులం ఆత్మ, అనాత్మ మధ్యన ఉన్న భేదం కలగాపులగం చేసి
పెట్టుకున్నారు Eg:- మట్టికి ఘటధర్మాన్ని కలిపి పెట్టుకున్నారు.

→ మన అనుభవం లో ఈ భేదం తెలియకుండుట, ఈ అవివేకం. మన
జీవితాన్ని శాసిస్తున్నది. ఈ సంగతి ఏమిటో కొంచెం పరిశీలించాలి. దీన్ని
పసిగట్టాలి. ఈ స్వామి నేనుకూడా ఏదో కొత్తగా చెప్పడం దీన్ని తెలుసుకోవాలి

→ ఇది వేదాంతం, పురాణం కాదు, హరికథ కాదు. ఇది జీవితానికి సంబంధించే
విషయం, జీవితంలో ఇటువంటి కోణం ఒకటి ఉన్నది అని కూడా తెలియడానికి
కోసం ఈ ఆత్మ, అనాత్మ వివేచనం అనేది.

* → అటువంటి ఆత్మ, అనాత్మ వివేచనం, భేదాన్ని తెలుసుకోవటం ఎందుకు?
అంటే కలగాపులగం చేసి పెట్టుకున్నాం గనక. పోనీ కలగాపులగంగానే ఉండనియ్యండి
ఇప్పుడు దీన్ని విడదీయటం ఎందుకు? అంటే. మనకి జీవితంలో అనుభవానికి
వచ్చే దుఃఖములు, భయములు రెండు ఉన్నాయి. వీటన్నిటికీ మూలంలో
ఆత్మ, అనాత్మ వివేచనం లేకపోవటమే గలదు.

→ శరీరం నకి అనారోగ్యానికి మూలం ఆహారనియమము, ఏది యోగ్యమైన
ఆహారం, ఏది కాదు తెలియకుండుటయే. అలాగే మానవ జీవిత
యొక్క పరమావధిని చేరుటకు మోక్షము అనేది దానికి. దానిని చేరుటకు
ఏది ఆత్మ, ఏది అనాత్మ అనే భేదం తెలియుట అత్యంత ఆవశ్యకము.

→ అంచేతనే అది చాలా కఠినమైన విషయం.

→ స్వానుభవ:= తన యొక్క అనుభవం. కఠినమైనది

→ ఆత్మ, అనాత్మ వివేకం గురించి ఉపన్యాసం చెప్పినాను నేను.. మీరు
జాగ్రత్తగా శ్రద్ధగా విన్నారు. ఈ ఉపన్యాసంలో చిన్న విద్వారం ఒకటి ఉంటుంది
విన్నవాళ్ళకి, 'అబ్బా, నిజమే సందేహం, మనం ఆత్మ, అనాత్మ విషయాన్ని

పరిశీలించాల్సింది అనే స్ఫూర్తి ఉన్న వాళ్ళకి కలగవచ్చు. చెప్పేవాడికి
వాడికి అది ఉపన్యాసం మాత్రమే. అనుభవం ఏమీ ఉండదు. దానివల్ల
ఉపయోగం ఏమి ఉన్నది?

→ Eg:- పురాణం శాస్త్రి గారు - ఉప్మా పాయి - మానేయటం. Eg.

→ ఇతరులకి చెప్పింది తను కూడా అనుభవం లోకి తెచ్చుకోవాలి. అది
మరింత కష్టం. అంటే 6,7 steps దగ్గర ఇతరులకి చెప్పడం తేలిక
కాబట్టి 6, దానికంటే తను అనుభవం లోకి తెచ్చుకోవటం మరింత కష్టము

→ బ్రహ్మాత్మన = పూర్ణ ఆత్మ స్వరూపంగా, సంస్థితః = నిలిచి ఉండుట,
అనే, ముక్తిః = మోక్షము, శతకోటి జన్మసు = వంద కోట్ల జన్మల
యందు, కృతైః = చేయబడిన, పుణ్యైః వినా = పుణ్యములు లేకుండా
నో లభ్యతే = దొరకదు.

→ తనకి ఆ ఆత్మ, అనాత్మ వివేకం అనుభవంలోకి వస్తే, Next step
ఏమిటో తెలుసునా? జీవన్ముక్తం. జీవన్ముక్తి అంటే ఎలా ఉంటుంది? దానికి
ఒక definition - "బ్రహ్మాత్మన సంస్థితః" - ఇది ఇంక highest అది. బ్రహ్మాత్మ
రూపంగా నిలిచి ఉండుట.

*→ బ్రహ్మ అంటే = పెద్ద బరువు ఏమి కాదు. బ్రహ్మ అంటే "పూర్ణము"
ఇప్పుడు ఎవరైనా ఏమీ కానీ కామనలు, కోర్కెలు ఏమీ లేకుండా ఉన్నాడు
ఎవరైనా కనపడ్డాడనుకోండి, వాడి చైతన్యం ఎలా ఉందనమాట? పూర్ణంగా
ఉంది అని అర్థం దానికి. చైతన్యం లో - చైతన్యం అంటే " తన స్వరూపం
consciousness, ఎరుక" ఆ ఎరుక యందు, "ఎరుక మీ స్వరూపం"
మీ స్వరూపం ఏమిటి? కాలేయము, liver, kidneys - ఎరుక.
Eg:- Bulb స్వరూపం ప్రకాశం. ఆ ఎరుక యందు మనిషికి ఏవో
కోర్కెలు ఉంటాయి. కోరిక అంటే అర్థం ఏమిటో తెలుసునా? వెలితి.
వెలితికి మరో పేరు కోరిక. వెలితి ఉండాలి
Eg:- మనం Road మీద వెళితే పక్కన ఎవరో చాలా వెలితే మనకి
వెలితి అనిపిస్తుంది. ఆ వెలితి అనుభవానికి రాగానే కోరిక పుడుతుంది
ఆ కోరిక తోటి ఆ దారిన పడి పోతుంటాడు. అది వెలితి

వెలితి - కోరిక - సంసారము. ఇది వరస. EMI (Easy monthly
Investment) అంటే సంసారం.
→ మీరు ఒకాయన కనపడతారు, చాల simple గా ఉంటారు. ఆయనలో
ఒక వెలితి ఏదీ అనుభవానికి రాదు. అంత పూర్ణం. వెలితి ఏదీ లేదు
వెలితి అనే మాట - లేదు. కోరికలు ఏమి లేవు. అసలు. రెండు భయము
లు ఏమి లేవు. భయం అనేది ఎరుగడు. భయము అంటే not
survival instinct of Body. జీవరాశులు తిన్ని వేసుకోవటం లాంటిది
భయం ఎప్పుడూ భవిష్యత్ గురించి ఉంటుంది. సాధారణంగా గృహస్థులు
ఎలా ఉంటారంటే భార్య, భర్త, కలిసి కడుపునిండా భోజనం చేసినా రేపు
మనకి భోజనం జరుగుతుందో, దొరికేదో అని భయపడుతూ భోజనం
చేస్తారు. రేపటి మాట ఏమిటి అనేది.
→ కాబట్టి భయం అన్నది psychological అది ఒక మానసికమైన emotion
మానసికమైన స్పందన. అది ఉన్నవాడు దుఃఖితుడు అవుతాడు. అటువంటి
భయము. లేని వాడు
→ దుఃఖము లేదు, భయము లేదు. ఎందువల్ల? నేను పూర్ణుడను. నాలో
ఏ వెలితి లేదు. కాబట్టి నాకు కోరికలు లేవు, కనుక దుఃఖము లేదు.
నేను పూర్ణుడను దేహము నశిస్తుంది తప్పిస్తే ఆత్మ చైతన్యమునకు
నాశనము లేదు అది ఎన్నటికీ నశించదు కాదు. అది కాలము కంటే అతీతమైనది
ఆ కాలమునకు అతీతమైన స్వరూపం ఆత్మ చైతన్యం. దానికి వినాశమే లేదు
ఆ ఆత్మ చైతన్యము పూర్ణము కనుకనే దానియందు కామనలే గానీ భయాలే గానీ
లేవు లేదు. ఆవిధముగా పూర్ణమైన ఆత్మ చైతన్యం రూపంగా నిలిచి ఉండుట
అదే మోక్షము. ఆ మోక్షము మనకోట్ల జన్మలు పుణ్యం చేసి ఉంటే గానీ
దొరకదు. చాల దుర్లభము.
→ నాకు ఎవరో అడిగారు. మీరు జీవన్ముక్తుని చూసారా? - నేను లక్ష్మణుడు
గారిని చెప్పాను.
→ అంటే లోప్పుపాటు, శిగారు, ఇతరులపై, ద్వేషము, భయము, కోరికలు
ఏమి లేకుండా పూర్ణంగా, నిబ్బరంగా ప్రేమ, కరుణ, దయ తప్ప ఇంకే

ఏమీ లేకుండా జీవితం లో సర్వ కాలముల యందు అలాగ ప్రేమతో ఉండిపోవటం దాని ~~యొంద~~ పేరే మోక్షం.

→ దేహం ఎప్పుడో పోతుంది. దేహం ఆత్మ కానే కాదు అసలు. ఆవిధంగా పూర్ణ ఆత్మ నిష్ఠలో ఉండుట, ఇది అన్నింటికంటే గొప్పది చాలా కఠినమైనది వందల కోట్ల జన్మల పుణ్యం వల్ల తప్ప అది మనకి దొరకదు.

→ రెండో శ్లోక అర్థం.

→ జంతూనాం = పుట్టే ప్రాణులకు, నరజన్మ = మానవుడిగా పుట్టుట, దుర్లభం = కఠినము. అతః = దానికంటే, పుంస్త్వం = పురుషుడిగా ఉండుట దుర్లభం. తతః = దానికంటే, విప్రతా = వేదాధ్యయన శీలురగుట. దుర్లభం. తస్మాత్ = దానికంటే, వైదిక ధర్మ మార్గ పరతా = వేదంలో చెప్పిన ధర్మ మార్గమునకు కట్టుబడి ఉండుట. దుర్లభం. విద్వత్త్వం = వేదములోని ధర్మములు తెలిసి ఉండుట, అస్మాత్ = దానికంటే, పరం = గొప్పది ఆత్మానాత్మ వివేచనం = ఆత్మకి, అనాత్మకి మధ్య ఉండే తేడా, తెలియుట ఇంకా దుర్లభం, స్వనుభవః = ఆ వివేకము అనుభవమునకు వచ్చుట మరింత కఠినము, బ్రహ్మాత్మనా = పూర్ణ ఆత్మ చైతన్యముగా, సంస్థితిః = చక్కగా నిలిచి ఉండుట, అది ముక్తిః = మోక్షము, జీవన్ముక్తి, శతకోటి జన్మసు = వంద కోట్ల జన్మల యందు కృతైః = చేయబడిన పుణ్యైః వినా = పుణ్యముల లేకుండా, నో లభ్యతే = లభించదు.

దుర్లభం త్రయమేవైతద్దేవానుగ్రహ హేతుకమ్ ।
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః ॥ 3 ॥

→ దుర్లభం, త్రయం - ఏవ - ఏతత్ - దేవానుగ్రహ హేతుకం - మనుష్యత్వం - ముముక్షుత్వం - మహాపురుష సంశ్రయః

→ ఏతత్ = ఈ, త్రయం = మూడు, దుర్లభం ఏవ = దొరకుట చాలా కష్టము, అది మూడు ఉన్నాయంటే. ఈ మూడూ దొరకటం చాలా కష్టం. ఒకవేళ దొరికితే ఆ పరమేశ్వరుని పూర్ణ అనుగ్రహం ఉంటేనే దొరుకుతాయి. లేకపోతే దొరకవు.

దేవానుగ్రహ హేతుకం = ఈశ్వరుని యొక్క అనుగ్రహము హేతువుగా గలది
అంటే ఈశ్వరుని అనుగ్రహం ఉంటేనే దొరుకుతాయి. లేకపోతే దొరకవు.
కాబట్టి ఈ మూడూ ఉంటే వాటికి దైవానుగ్రహం ఉన్నది.
→ ఏమిటది ఆ మూడు? మూడూ ఉంటే 100% అనుగ్రహం
మనుష్యత్వమే = మనిషి గా పుట్టుట. మనకి తప్పకుండా 33% వచ్చేసింది
ఆత్మస్వరూపాన్ని తెలుసుకునే భాగ్యము మనిషికే కలుగుతుంది. అవకాశముగాని
possibility ఉంది. వాళ్ళ భాగ్యం. మొదటిది చాలామంది దగ్గర ఉంది.
రెండవది చాలా కొద్ది మంది దగ్గర ఉంటుంది
ముముక్షుత్వం = మోక్షమును కోరువాడు అగుట. ఇది మీరు
తెలుసుకోవాలి. లోకంలో జనులు మోక్షమును కోరరు.
Eg:- ఒక పెద్ద Mall లో వాళ్ళలో మోక్షమును కోరేవారు ఎంతమంది
ఉంటారు? "Zero", తిరుమలలో, పెద్ద ఉత్సవం, తిరుపతి etc వాళ్ళలో
కూడా 'జీరో'. అంటే లౌకికమైన స్థానము ఒక Mall. అక్కడ మోక్షం
కోరేవాడు ఎవడూ లేడు, ఇక్కడ మోక్షము గలవాడు ఎవడూ లేడు.
ఎంత విచారమో చూడండి. Eg:- తిరుపతి కి 1000 లో 99, మంది కోరికల
కోసం 10 మంది ప్రేమతో వస్తారు. ఒక్కడు వైరాగ్యం కావాలి అని కోరటానికి
వస్తాడు. అని చెప్పారు. కాబట్టి నాకు మోక్షం కావాలి.
→ మోక్షం అంటే తన స్వరూపం యొక్క పూర్ణత్వమును గుర్తెరిగి, ప్రజ్ఞాస్థితి
యందు నిలిచి ఉండుట. అది మోక్షం. అది కావాలి అని కోరేవారు ఎవరో
ఉంటారు. అంతెందుకు వేద పండితులలో కూడా మోక్షమును కోరువారు ఎవరూ
శాస్త్ర పండితులలో కూడా same అందరూ కోరేది ఏమిటంటే "ధర్మ, అర్థ,
కామ" మూడు పేర్లు ఉన్నాయి కదా! అవి correct వరుసలో పెట్టాలంటే
కోరికలకి తగ్గ వరుసలో పెట్టాలంటే ముందు డబ్బు కోరుకుంటారు - అర్థ, తరువాత
కామ - భోగములను కోరుకుంటారు, ఆ తరువాత ఇంకేమైనా కొంచెం chance,
అవకాశం ఉంటే పుణ్యాన్ని కోరుకుంటారు. Eg:- 100 Rs లో 90 భోగాలకు,
5 Rs దాచుకో 5 Rs పుణ్యానికి ఖర్చు పెడతాడు ఎందుకంటే ఇంకా డబ్బు
వస్తుంది పుణ్యం ఉంటే. తరువాత దేహం పడిపోయిన తరువాత స్వర్గానికి

ఎవరికో ఎంతో, అందుకోసం పుణ్యాన్ని కోరేవారు ఉన్నారు తప్ప
మోక్షాన్ని కోరేవారు లేరు. పుణ్యం వేరు, మోక్షం వేరు. రెండూ
ఒకటనుకుంటారు. పుణ్యానికి opposit లో పాపం కూడా పక్కనే ఉంటుంది
మోక్షానికి పక్కన ఏమీ ఉండదు. వాడు అలా బ్రహ్మనిష్ఠుడిగా
స్థితుడై ఉంటాడు.

→ మోక్షం అంటే అర్థం ఏమిటో తెలుసుకుందాం; freedom. మోక్షం
అంటే freedom అంటే మాకు తోచిన భోజనం వండుకొని తినడం
అది ఎలాగా చేస్తూనే ఉన్నాంగా ఇప్పుడు దాంట్లో ఏమీ లోటు ఏమీ లేదు.
ఏది తోస్తే అది మాట్లాడటం, ఎక్కడికి వెళితే అక్కడికి వెళ్లడం. అన్నీ
చేస్తూనే ఉన్నారు. మరి మోక్షం అంటే ఏమిటి? freedom. దేనినుంచి
freedom?

→ ఈ freedom physical freedom, అది మన అందరికీ ఉంది జైళ్లో
పెట్టిన వాళ్లకి లేదు. Political freedom - లోచన వారికి vote
వేయడం. అది మోక్షం అంటే? కాదు. physical, political కాదు.
Economic freedom అని ఇంకొకటి ఉంది అంటే కొంత డబ్బు కూడ
మనకి ఉంటే మనం ప్రతి దానికి వీళ్ళకి వాళ్ళకి ఊడిగం చేయకున్నా
స్వతంత్రంగా జీవించవచ్చు. ఇప్పుడు అది ఆ freedom same కాదు
ఆ freedom కూడా కాదు. మరి ఏమిటది? ఏం freedom కావాలి?
Psychological freedom మానసిక స్వతంత్రత, పరాధీనత
లేకుండుట.

→ ఇప్పుడు మనం లోపల ఏదో ఒక వెలితి అనుభవానికి వస్తుంద-
నుకోండి, ఏదో లోటు, అనుభవానికి వచ్చిందనుకోండి, అంటే మనం
మానసికంగా ఇతరులపై ఆధారపడి ఉన్నారు

Eg:- మీ cellphone ఒక గంట కనపడక పోతే ఎలా ఉంటుంది
అదే మానసిక పరాధీనత అంటారు

→ Cell phone కనపడకపోయినా నిమ్మకి నీరెత్తినట్టుగా ఉంటే వాడు
freedom కలవాడు అని అర్థం

→ ఆ రకంగా మన లోపలి ప్రాణదాతృత్వానికి, లోపలి కులానికి ఆనందానికి ఇతరముపై ఆధార పడకుండుట. అది freedom

→ మనకి సుఖం కావాలి. ఈ సుఖం కోసం మనం ప్రపంచం అంతా పరుగు తీస్తున్నామా లేదా? డబ్బు వెనక, భోగముల వెనక. అది మరి freedom లేకపోవటమే కదా. దాంట్లో freedom ఏముంది?

→ Suppose మీరు ఆలోచించండి. మీరు అనంత ఆనందం, Infinite happiness, bliss, మీ హృదయం లో మీ అనుభవానికి వచ్చిందనుకో అప్పుడు మీరు ప్రపంచ సామ్రాజ్యాన్ని ఇచ్చి చెప్పినా అక్కర్లేదని తోసి వేస్తారు. అది freedom

→ అంటే ఆనందం కోసం అర్రులు చాచనక్కర లేకుండా, పిల్లకాయల్ని, వాళ్ల కాళ్ళు పట్టుకోనక్కర లేకుండా డబ్బు వెనకాల పరుగులు తీయనక్కర లేకుండా, భోగముల వెంట పరుగులెత్తనక్కర లేకుండా తన హృదయం లో పూర్ణమైన ఆనందమును. ఎంత ఆనందము? ఈ సకల లోకములను సృష్టించి, పాలించి, ఉపసంహరించే బ్రహ్మదేవునికి ఉండే ఆనందం కంటే గొప్ప ఆనందం ను తన హృదయంలో ఆవిష్కరించటం తెలిసిన నుకొంటే ఎవరికైనా, వాడికి ఉన్న freedom. అది ultimate. ఆ freedom నాకు కావాలి

* పోని స్వర్గానికి వెళితే వస్తుందా - రాదు. కోటీశ్వరుడు అయితే వస్తుందా? రాదు. బంగారం తోటి పోయింది (దాచుకోవటం). భోగముల గురించి ఊరికే మాట వరసకి అనుకోవటమే గాని భోగ రోగ భయమే కదా. భోగం వెనకనే రోగం ఉంటుంది. భోగం పట్టుకుంటే రోగం వస్తుంది. భోగం వదిలి పెట్టటమే యోగం. కాబట్టి భోగం గురించి చెప్పనక్కర్లేదు. భోగం వెంట పడేవాడికి freedom అనేది ఉండనే ఉండదు.

→ ఈ లోకంలో అర్థము, భోగం అయిపోయింది స్వర్గానికి వెళితే అక్కడ freedom ఉండదు. బ్రహ్మదేవుడికి కూడా freedom లేదు. జ్ఞానికి ఉంది freedom. పూర్తి స్వాతంత్ర్యము. freedom అది అనుభవానికి వస్తుంది. అది మోక్షము. అంటే అది తన హృదయంలో తన

స్వరూపం యొక్క పూర్ణత్వమును అనుభవమునకు తెచ్చుకొనుట ద్వారా ఆ మోక్షము, ఆ పూర్ణత్వము, ఆ freedom అనుభవానికి వస్తుంది. నాకు ఆ మోక్షం కావాలి అని కోరుకోవటం. దీన్ని ముముక్షుత్వం అంటారు

→ వివేక చూడామణి చెప్పినది ఎవడు అడుగుతాడు, పాఠానికి ఎవడు వస్తాండు! ముముక్షువు మాత్రమే. - 60%

→ మూడవది :- మహాపురుష సంశ్రయః = ఒక మహాత్ముని యొక్క ఆలంబనము. వివేక చూడామణి చెప్పేందుకు ఎవడో ఒకడు ఉండాలి కదా. పూజ, తీర్థయాత్ర, పురాణం - ఇవన్నీ చెప్పటానికి దొరుకుతారు కానీ ఉపదేశ, సాహస్రి, వివేక చూడామణి చెప్పేవాడు అరుదు

→ అదే మహా పురుష సంశ్రయః. ఆ వివేక చూడామణి, ఉపదేశ సాహస్రి, శంకర భగవత్పాదుల భాష్యం ఇవి ప్రేమతో చెప్పేవాడు కావాలి ప్రేమ తప్ప ఇంక వేరే హేతువు లేదు. దీని కోసం పాఠం చెప్పటం అంటే ప్రేమ తప్ప ఇంక వేరే హేతువు ఏమీ లేదు. బంగారం కిరీటం కూడా అక్కర లేదు. ప్రేమ మాత్రమే ఆ స్ఫూర్తిని ఇచ్చే అటువంటి మనిషి దొరకటం అది మరీ కఠినం. మనకి పూజ్య స్వామీజీ లాంటి వారు దొరికారు - 100%

→ రెండవ సారి అర్థం-

→ ఏతత్ = ఈ, త్రయం = మూడు, ఏవ = నిశ్చయముగా, దుర్లభం = దొరకుట కష్టము. దేవానుగ్రహ హేతుకం = దేవుని దయ ఉంటే మాత్రమే లభిస్తాయి., మనుష్యత్వం = పురుషుడు గానీ స్త్రీ గానీ మనిషి అయి పుట్టుట, ముముక్షుత్వం = మోక్షమును కోరువాడు అగుట., మహా పురుష సంశ్రయః = మోక్ష శాస్త్రమును బోధించే సద్గురువు ను పట్టుకొనుట

→ పట్టుకోవాల్సి ఉంటుంది లేకపోతే జారిపోతారు ఎందుకంటే మరు డబ్బు ఇచ్చి కొనలేరు, భోగాలని చూపించి కొనలేరు, దొరకరు. వాళ్ళని పట్టుకోవటం కూడా భాగ్యమే

లబ్ధ్వా కథంచిన్నరజన్మ దుర్లభం
తత్రాపి పుంస్త్వం శ్రుతి పారదర్శనమ్ ।
యః స్వాత్మముక్తౌ న యతేత మూఢధీః
స హ్యాత్మహా స్వం వినిహంత్యసద్గ్రహాత్ ॥ 4 ॥

→ లబ్ధ్వా - కథంచిత్ - నరజన్మ - దుర్లభం - తత్ర - అపి - పుంస్త్వం - శ్రుతి పార దర్శనమ్ - యః - స్వాత్మ ముక్తౌ - న - యతేత - మూఢధీః - సః - హి - ఆత్మహా - స్వం - వినిహంతి - అసద్గ్రహాత్

→ కథంచిత్ = , దుర్లభం = పొందశక్యము కాని, నరజన్మ = మానవ జన్మను, లబ్ధ్వా = పొంది,

→ ఒక లెక్క చెపుతారు 84,00,000 జీవరాశుల అని మొత్తం మీద లెక్క లేనన్ని ప్రాణులు గలవు. జీవునికి ఏ జన్మ అయినా రావచ్చు. probability మనుష్య జన్మ రావటం అంత కష్టం. అయితే వచ్చేసింది గా. లబ్ధ్వా.

→ అంచేత మనుష్య జన్మని పొందిన తరువాత అది వృధా కాకుండా చూసుకోవాలి అని అభిప్రాయం

→ తత్రాపి = ఆ మనుష్య జన్మ యందు కూడా, శ్రుతి పారదర్శనం = వేదముల యొక్క అంతమును చూడగలిగే, పుంస్త్వము = పురుష జన్మను, లబ్ధ్వా = పొంది

→ ఈ ప్రసంగం మనం చూశాం. వేదాలన్ని చదువుకొని ఆ వేదాల అంతం నందు ఉండే ఉపనిషత్తులను దర్శించుట అనే భాగ్యము ఎవరికి ఎక్కువ ఉండేదంటారు మగవారికే ఎక్కువ ఉన్నది సమాజంలో. ఈ మధ్యన improve అయింది.

→ మనిషై పుట్టాడు, అంతే కాకుండా మగవాడై పుట్టాడు. వాడు గనక శ్రద్ధ పెట్టినట్లయితే వేదముల యొక్క అంతము నందు, అంటే ఉపనిషత్తుల యందు ఉండేటువంటి సత్యమును, అనగా ఆత్మ తత్వమును దర్శించే భాగ్యం వాడికి ఉంది. ఆ chance వాడికి ఉండి కూడా,

→ యః = ఎవడయితే, మూఢధీః = వ్యామోహము చెందిన బుద్ధి గలవాడు, స్వాత్మ ముక్తౌ = తన యొక్క మోక్షము నందు, న యతేత = ప్రయత్నమును చేయడో.

→ మీరు ఆలోచించండి ఒక గ్రామంలో మంచి సంస్కృత విద్వాంసులు ఒక్కరో, ఇద్దరో ఉన్నారు. వాళ్ళ ఇంటలో ఒక పిల్లవాడు పుట్టాడు. వాడు పెరిగాడు, పెద్దవాడు అయ్యాడు రామ శబ్దం రాదు వాడికి ఎంత దురదృష్టం? అలాగే ఉంటారు కొంత మంది. వాడుకనక ఒక పసరు మనస్సు పెట్టి ఉన్నట్లయితే వాడు మొత్తం సంస్కృత భాషని అంతా వంట బట్టేయచ్చు. అలాంటి వాతావరణం లో ఉండి కూడా ఎవరైతే సంస్కృతం నేర్చుకునే ప్రయత్నం చేయలేదో వాడి తెలివితేటలకి ఏమని చెప్పాలి. ఇక్కడ topic ఏమిటంటే అన్ని సౌకర్యములు ఉండికూడా ఎవరైతే ఆత్మ స్వరూపంని తెలియుట, ఇక్కడ వేదాంతం లో జగత్తుని తెలియుట, ఈశ్వరుని తెలియుట, తన స్వరూపంని తెలియుట అని మూడు ఉంటాయి. ఏది first - తాను first. కాబట్టి తనని తాను తెలియుట మొట్ట మొదటి కర్తవ్యం. తరువాతనే జగత్తుని, ఈశ్వరుని తెలియుట. ఉపాసనలో ఈశ్వరుని తెలియుట ప్రధమ స్థానంలో ఉంటుంది లోక వ్యవహారంలో జగత్తుని తెలియుట ప్రధమ స్థానంలో ఉంటుంది

→ Business అంటే జగత్తు తెలియాలి, కర్మ, ఉపాసన అంటే ఈశ్వరుని తెలియాలి, ఉపనిషత్, వేదాంతం అంటే తనని తాను తెలియవలెను. ఇది వ్యవస్థ.

→ తనని తాను తెలుసుకోకుండా జగత్తుని తెలుసుకుంటే అది మీరు తప్పుగా తెలుసుకుంటారు. ఈశ్వరుని తెలుసుకుంటే ఇంకా తప్పుగా తెలుసుకుంటారు మనవాళ్ళు తెలుసుకున్న ఈశ్వరుడు చాలా చిత్రంగా ఉంటాడు ఆ ఈశ్వరుడు అది వాస్తవికతకు బహు దూరంగా ఉంటుంది

→ కాబట్టి బుద్ధిమంతుడు అయినవాడు తనని తాను తెలుసుకొని, అప్పుడు జగత్తుని ఆ జగత్తుని సృష్టించి, పాలించే ఈశ్వరుని ఆ క్రమంలో తెలుసుకుంటారు ఆ దృష్టితో ఇక్కడ చెబుతున్నారు

→ కాబట్టి మానవజన్మ పుట్టినటువంటి వాడు మొట్టమొదట తనయొక్క స్వరూపాన్ని తెలుసుకొని సంసార బంధము నుండి మోక్షమును పొందవలెను. దానికొరకై ప్రయత్నం చేయవలెను. కానీ వాడి బుద్ధి వ్యామోహంతో నిండి ఉన్నది

→ మూఢః = మూఢ అంటే తెట్టు అనుకోవద్దు. వ్యామోహమును కలిగి
ఉండుట. వ్యామోహము, మోహము రెండూ ఒకటే
→ మోహం అనగా ఉన్నదాన్ని తప్పుగా తెలియుట. అది మోహం.
అక్కడ త్రాడు ఉంటే పాము అనుకొని అలా భయపడుతూనే ఉంటాడు.
→ అలాగే ఆనందము జగత్తులో గలదు అని అనుకుంటాడు మనిషి.
దానిపేరు మోహము. ఆ మోహం తోటి మనిషి ఏం చేస్తాడంటే ఒక
జీవిత కాలాన్ని జగత్తులోని విషయముల వెంట పరుగులు తీస్తూ
గడిపేస్తాడు. అలాగే ప్రాణాలు విడిచిపెడతాడు. మోహము ఎంత
చెడ్డదో గమనించండి. మోహంలో ఉండరాదు. దానికే మరోపేరు
అజ్ఞానము. దాంట్లో ఉండకూడదు. తెలిసి ఉండాలి. తెలియకపోతే ఎంత
నష్టం వస్తుంది. Eg: ఒకడికి కళ్ళకలక, అజీర్తి వచ్చింది. దానికి Doctor
విడివిడిగా మందు ఇస్తే reverce గా వేసుకున్నాడు. దీనిపేరే మోహము.
→ కాబట్టి జీవితంలో అలాంటి మోహము ఉండరాదు. కానీ వీడికి ఆ
మోహం ఉంది అందుకోసం మానవుడు పుట్టి కూడా ఆత్మస్వరూపాన్ని
తెలిసే ప్రయత్నం వీడు చేయటం లేదు. ఎవడయితే అలా ఉంటాడో
→ సః = అట్టివాడు, హా = నిశ్చయముగా, అసద్గ్రహాత్ = తప్పుని
పట్టుకొనుట వలన, పట్టుకోవటం
→ ఒప్పును పట్టుకోవాలండి, తప్పును పట్టుకోకూడదు, మంచిని, ఒప్పుని
పట్టుకుంటే మీరు జీవితంలో పైకి వస్తారు. తప్పుని పట్టుకుంటే ఎక్కడికో
పోతుంది. అలాంటి పొరపాటు చేయకూడదు. జీవితంలో చాలామంది
తప్పుని పట్టుకొని చాలా నష్టాన్ని పొందుతారు.
→ అటువంటి తప్పుని పట్టుకున్నాడు వీడు. ఆత్మస్వరూపాన్ని పట్టుకోవటం
తెలుసుకోవటం పోయి, జగత్తునో, దేన్నో పట్టుకున్నాడు. తప్పు పట్టుకోవటంవల్ల
→ ఆత్మహా = ఆత్మహత్య చేసుకున్నవాడు, స్వయం = తన ప్రయోజనాన్ని
వినిహంతి = చెడగొట్టుకొనును.
→ నిన్న సత్సంగ్‌లో ఒక ప్రశ్న అడిగారు. ఆత్మహత్యపై మీ అభిప్రాయం
ఏమిటి అని - నేను చెప్పాను. చూడండి వేదాంతుల దృష్టిలో మీరు అనుకుంటున్న

ఆత్మ హాత్మ ఉండును వేదాంతుల దృష్టిలో. దేహము యొక్క చావు చావే కానిది. దేహము ఎప్పుడూ జీవించి లేదు. అది ఎప్పుడూ జడము. అందుచేత దేహము యొక్క చావుని చావుగా పరిగణించరు

→ మానవుడయి పుట్టి మోక్షానికై ప్రయత్నించకుండగా మానవ జన్మని ముగించి వేయుటనే చావుగా పరిగణిస్తారు

→ Eg ÷ MA student fail అయితే వాడికి అది చావు. దేహము చావుని వేదాంతులు పరిగణలోకి తీసుకోరు. వేదాంతుల దృష్టిలో చావు మానవుడయి పుట్టి ఆత్మ స్వరూపాన్ని తెలుసుకోకుండా జీవితాన్ని ముగించుటే చావు. వేదాంతుల ఆత్మహాత్మ ఇది ఉపనిషత్తులలో కూడా ఈశావాస్య ఉపనిషత్ - ఆ దృష్టిని మనసులో పెట్టుకొని

→ శంకరులు ఆత్మ స్వరూపంని తెలుసుకోకుండా దేహయాత్రని చాలించిన వాడు ఆత్మహాత్మని చేసుకున్నవాడితో సమానం. వాడు తనయొక్క గొప్ప ప్రయోజనం (స్వర్గం) ను చెడగొట్టుకున్నాడు

Eg ÷ ఒకడు పర్వత శిఖరం మీదికి వెళ్ళాడు అక్కడ నిలబడి చేయి చాచితే చంద్రుని వరకు దొరుకుతుంది (అమృతం) కాని వాడు పైకి చూడలేదు. చేయి చాచలేదు మానవ జీవితంని పొంది తన స్వరూపంని తెలియకుండుట అట్టిదే దోషము. అది ఆత్మ హాత్య తో సమానము.

→ కథంచిత = ఏదో విధముగా, (అంటే మానవ జన్మ పొందటం అంత కష్టం ఏదో కష్టపడి పొందాడు అని అర్థం), దుర్లభం = ఉండ శక్యం కాని, నరజన్మ = మానవ జన్మను, లబ్ధ్వా = పొంది, తత్రాపి = ఆ మానవ జన్మయందు కూడా శ్రుతిపార దర్శనం = ఉపనిషత్తుల తత్వమును, ఆత్మ తత్వమును దర్శించగలిగే పుంస్త్వం = పురుష జన్మను, లబ్ధ్వా = పొంది, యః = ఎవడయితే, మూఢధీః = వ్యామోహము చెందిన బుద్ధిగలవాడై, స్వాత్మ ముక్తౌ = తన మోక్షము విషయమై (తన మోక్షము నందు), నయతేత = ప్రయత్నమును చేయడో (ప్రయత్నం అంటే శాస్త్రమును శ్రవణం చేసి మననము, నిధిధ్యాసనము చేయుట) విషయమును తెలుసుకొనుట, తెలుసుకున్న దాన్ని మననం చేసి తన స్వరూపంని దర్శించుట. ఇకడంతా మన దృష్టి అంతా జ్ఞానము - తెలియుట అనే దాని మీద ఉంటుంది - అది ప్రయత్నం. ఆ ప్రయత్నాన్ని ఎవడయితే చేయడో

సః = అట్టివాడు, హి = నిశ్చయముగా, ఆత్మః = ఆత్మహత్య చేసుకున్న [వాడే] వాడు ఆత్మహత్య చేసుకున్నవాడితో సమానం. ఎందువల్ల?, అసద్గ్రహాత్ = అప్పును పట్టుకొనుట వలన. (చెడును)

Eg: University లో join చేసి M.A. చదువుకోరా అని పంపిస్తే class మానేసి movies కి తిరిగి సమయాన్ని అంతటిని వృధా చేసే వాడు దేనిని పట్టుకున్నాడు? మంచినా? చెడునా? చెడుని పట్టుకున్నాడు

స్వం = తన ప్రయోజనం ను, వినిహంతి = చెడగొట్టుకొనుచున్నాడు.

→ మానవ జన్మకి ప్రయోజనం = ఆత్మ స్వరూపాన్ని తెలుసుకొనుట. చాలా మంది ఏమనుకుంటారంటే ఒక పెద్ద Business empire ని నిలబెట్టాలి అనుకుంటారు అది తెలివి తేటలు కాదు. Time waste చేసుకున్నట్టే. భోజనం కోటి సంపాదించిన వాడు ఏమి లేని వాడు same తింటాడు దానికి కోటి సంపాదించటం ఎందుకు?

→ ఎవడైతే తన స్వరూపాన్ని తెలుసుకునే ప్రయత్నం చేయడో, వాడు అప్పుని పట్టుకొనుట వలన Eg: చెట్టు నుండి కింద పడుతున్నప్పుడు మడుని పట్టుకుంటారా, కొమ్మని పట్టుకుంటారా? [illegible]యుడు - ఉబ్బు, కొమ్మ = జ్ఞానము దాన్ని పట్టుకుంటే మోక్షాన్ని పొందుతాడు, కాబట్టి తన ప్రయోజనాన్ని తాను కాపాడుకోవాలి. తన ప్రయోజనం ఏమి? మానవ జన్మ మాత్రమునందు ఆత్మ స్వరూపాన్ని తెలుసుకొను తెలుసుకోమన్నారు కాని మిగిలినవి ఏం పట్టుకొను మన్నారు లేదు Eg: విదుర కొండలు, 80 ప్రదక్షిణ. తెలుసుకుంటే ఏమవుతుంది? ఏమి అవ్వాలో అది అవుతుంది తన స్వరూపం ని తెలుసుకున్నవాడు జీవన్ముక్తుడు అయిపోతాడు. అప్రయోజనాన్ని చెడగొట్టుకొని వాడు జీవితాన్ని చాలిస్తే అది ఆత్మ హత్య సదృశము.

→ మీరు ఆత్మ స్వరూపాన్ని తెలుసుకోండి సుమా అది పట్టుకోండి. ధనమును, భోగములను తీసుకుంటే ఏదో స్వర్గానికి వెళ్లాలంటూ ఏవో కామ్య కర్మలు, వాటికి వాటికి పట్టుకోవటం కాదు. మీరు ఆత్మజ్ఞానము అనే లక్ష్యమును పట్టుకోండి గట్టిగా అని అభిప్రాయం

ఇతః కోన్వస్తి మూఢాత్మా యస్తు స్వార్థే ప్రమాద్యతి।
దుర్లభం మానుషం దేహం ప్రాప్య తత్రాపి పౌరుషమ్ ॥ 5॥

→ ఇతః, కః, ను, అస్తి, మూఢాత్మా, యః, తు, స్వార్థే, ప్రమాద్యతి, దుర్లభం, మానుషం, దేహం, ప్రాప్య, తత్ర, అపి, పౌరుషమ్.

→ యస్తు = ఎవడైతే, దుర్లభం = పొందశక్యం కాని, మానుషం = మనుష్య జన్మను చెందిన, దేహం = దేహమును, తత్రాపి = దానియందు కూడా పౌరుషం = పురుష జన్మను, ప్రాప్య = పొంది, మూఢాత్మా = మోహమును చెందిన బుద్ధిగలవాడు (అగుటవల్లన) ఐ. ఇక్కడ ఆత్మ అంటే బుద్ధి స్వార్థే = తన ప్రయోజనం మొదల, ప్రమాద్యతి = ఏమరపాటు కలిగి ఉన్నాడో, Eg:- బుధవారం class అని చెప్పి మరిచిపోయి ఎక్కడికో వెళ్ళిపోతే. అలా మరిచిపోవచ్చు, భోజనం, coffee మరచిపోతారా? మనుష్య జన్మ పొందిన తరువాత ఆత్మ స్వరూపాన్ని మరచిపోతే, అంతకంటే పెద్ద దోషం, ఏమరపాటు ఇక ఏముంటుంది. ఎవడైతే తన స్వరూప విషయమై అటువంటి ఏమరపాటుని కలిగి ఉంటాడో, ఇతః = వీని కంటే, మూఢాత్మా = మోహము ను చెందిన బుద్ధిగలవాడు, కోను = ఎవడు, అస్తి = ఉన్నాడు? అంటే ఎవడూ లేడు అని అర్థం

Eg:- fee కట్టి hostel లో join చేసి pocket money ఇచ్చి పంపితే వాడు బలాదూర్ తిరిగి పరీక్షలో fail ఐతే వాడికంటే మూర్ఖుడు ఎవడైనా ఉంటాడా

→ వీడికి మానవ జన్మ దొరికింది. అసలు అదే కష్టం, పురుష జన్మ దొరికింది, ఇప్పుడు వీడు ఏం చేయాలి? తన స్వరూపాన్ని తెలుసుకోవాలి తద్వారా తన ప్రయోజనం ని తాని కాపాడుకోవాలి

Eg:- మనుష్య దేహం - ఆరోగ్యం తో సంబంధం లేకుండా - ఆహారనియమాలు లేకుండా sugar B.P. తెచ్చుకుంటే మనం మన ఉపకారం చేసుకున్నట్లు కాలేదు? అది ఏమరపాటు కాదు?

→ ఆహార నియమం విషయంలో ఎంతో జాగ్రత్తగా ఉండాల, తెలియకపోతే చూసి ఐనా నేర్చుకోవాలి. మీ ఆరోగ్యాన్ని మీరే చెడగొట్టుకుంటే ఏమంటారు? తన ప్రయోజనం విషయంలో ఏమరపాటు కలిగి ఉన్నాడు

→ మనిషై పుట్టి ఆత్మజ్ఞానం విషయంలో ఏమరపాటు కలిగి ఉంటాడు, అది ఎంత పొరపాటు. అలాంటి పొరపాటు ఎన్నడూ చేయరాదు. నీకు ఏది మంచో అది తెలుసుకో.

→ ఆరోగ్యం విషయంలో రెండు list లు తయారు చేసుకోవాలి ఆచరించదగినవి, తినకూడనివి. Eg:- పంచదార, బెల్లం

→ మీ స్వరూపాన్ని మీరు తెలుసుకోకుండా అలాగ జీవితాన్ని ముందుకు తోసుకుంటూ మీరు ఎంత నష్టపోతున్నారో మీకు తెలియటం లేదు. ఈ ఆత్మ స్వరూపం విషయంలో అన్నింటికీ విడిచి పెట్టి వెంట పడుతున్నారు చాతకాని వారు అని అనుకుంటున్నారా ఏమిటి? కాబట్టి మీరు చేసిన ఘన కార్యాలు అన్నీ చాలు ఈ పాటికి. వివేకచూడామణి పుస్తకం పట్టుకొని శ్లోకం, ప్రతిపదార్థం, తాత్పర్యం తెలుసుకొని దానికి తగ్గట్టు జీవితాన్ని మలచుకొని ప్రతిక్షణం కూడా మీరు ఆ పని చేయటం నేర్చుకోండి. ఎంత పొరపాటు. అంతకన్నా మూర్ఖత్వం ఏదైనా ఉంటుందా అని శ్లోకం

→ దుర్లభం = పొంద శక్యము కాని, మానుషం = మనుష్య జన్మను చెందిన, దేహం = దేహమును, తత్రాపి = దానియందు కూడా, పౌరుషం = పురుష జన్మను; ప్రాప్య = పొంది, ~~యస్తు~~ యః తు = ఎవడైతే, స్వార్థే = తన స్వరూపం విషయమై, ప్రమాద్యతి = ఏమరపాటు కలిగి ఉంటాడో, ఇతః = దీనికంటే, మూఢాత్మా = మోహము చెందిన బుద్ధిగలవాడు, కో ను = ఎవడు, అస్తి = గలడు. అనగా ఎవరూ ఉండరు

వదంతు శాస్త్రాణి యజంతు దేవాన్
కుర్వంతు కర్మాణి భజంతు దేవతాః ।
ఆత్మైక్యబోధేన వినా విముక్తిః
న సిధ్యతి బ్రహ్మశతాంతరేఽపి ॥ 6 ॥

→ Revolutionary శ్లోకం. సాధారణంగా మనుష్యులు ఎలా ఆలోచిస్తారు? మేము ఈ దేవతను పూజించాము, ఇంకో దేవతను పూజిస్తాము అని ఆలోచిస్తారు

→వదంతు, శాస్త్రాణి, యజంతు, దేవాన్, కుర్వంతు, కర్మాణి, భజంతు, దేవతాః,
ఆత్మైక్య బోధేన, వినా, విముక్తిః, న, సిధ్యతి, బ్రహ్మశతాంతరే, అపి.
→ చూడండి మీరు ఈ గొప్ప గొప్ప శ్లోకాలని చాలా చెప్పొచ్చు, ఆత్మస్వరూపాన్ని తెలుసుకున్నారా? అది ముఖ్యం. అదే మొదట అంటారు
→శాస్త్రాణి = శాస్త్రములను, వదంతు = చెప్పెదరు గాక, దీనికి విద్యాప్రకాశానంద గిరి గారు ఒక కథ చెప్పారు. ఒక చతుశ్శాస్త్ర పండితుడు నది దాటుతున్నారు పడవ నడిపే వాడిని ఆయన అడిగారు ఆ శాస్త్రాలు చదివావా అని. జ్యోతిష్య, తర్క, వ్యాకరణ, వేదాంత శాస్త్రం. ఆయన మీకు ఈత వచ్చునా అని అడిగారు
→కాబట్టి నదిలో మునిగిపోతున్నప్పుడు ఈత రావాలి గాని శాస్త్రాలను ఎందుకు
వదంతు శాస్త్రాణి - శాస్త్రములను వల్లిస్తే కుదరదు ఆత్మ స్వరూపాన్ని తెలుసుకోవాలి.
సచ్చిదానంద ఆత్మ అది. మీ మనస్సు కాదు, మీ శరీరము కాదు. అది బ్రహ్మ, పరమాత్మ. ఇంక ఈ విషయం చాలా వస్తుంది
→ఇక్కడ మీరు దీంట్లో గమనించాల్సింది నహి నిందా న్యాయము అంటారు. శాస్త్రములని తెలుసుకోవటం కాదు ఆత్మజ్ఞానము గొప్పది అని చెప్పటమే ముఖ్యము
→దేవాన్ = దేవతలను, యజంతు = పూజించెదరు గాక. రోజూ దేవతలని పూజించారు కానీ ఆత్మ స్వరూపం తెలియదు ఏమిటి లాభం?
→అలా చాలా మంది దేవతలని పూజిస్తే ఏముంది? మీరు ఏమైనా ఆత్మ స్వరూపాన్ని తెలుసుకున్నారా? వివేక చూడామణిని అర్థం చేసుకున్నారా? దేవతలని పూజిస్తున్నాము అంటే ఒరిగేది ఏమి లేదు ఆ పూజ చేయండి
→కర్మాణి = కర్మలను, కుర్వంతు = చేసెదరు గాక. వివిధ కర్మలు చేస్తుంటారు. వైదిక కుటుంబాలలో శ్రౌత కర్మలు. ఆధునికం అయితే సత్యనారాయణ వ్రతం చేసాము, వేంకటేశ్వర దీపారాధన చేసాము etc ఆత్మ స్వరూపం తెలిసినవాడు ఒక్కడూ కనపడడు
అయ్యప్ప స్వామి దేవాలయం లో తత్త్వమసి - నా దర్శనం నాకు అయింది.
→కాబట్టి, కర్మలను, వ్రతాలను చేసేస్తే అయిపోదు ఆత్మ స్వరూపాన్ని తెలుసుకోవాలి
→దేవతాః = దేవతలను, భజంతు = సేవించెదరు గాక. ఈ సేవ అనే మాట బాగా ఉన్నది. శ్రీ స్వామి వారికి లఘు సేవ చేస్తున్నాను, ధూప సేవ చేస్తున్నాను, దీప సేవ - సేవ అంతా తనకోసమే, అద్దం ముందు నిలబడి అలా ఇలా చేసుకుంటే మీరు

అద్దానికి సేవ చేస్తున్నారా మీకు మీరే చేసుకుంటున్నారా? - ప్రశ్నాయన
→ దేవుళ్ళకి సేవ చేస్తున్నాను - అన్నట్లుయి. మీరు చింత చేయకండి. మీరు మీ
స్వరూపాన్ని తెలుసుకోండి. మానవ స్వభావం ఇలా ఉంటుంది. ఎవరో బయట
మొట్టికాయ వేసి చెపితేనే తెలుసుకుంటారు. చెప్పినా తెలుసుకోలేకపోవడం కూడా
కలదు. కాబట్టి ఈ పని మీరు చేసినా మీకు మోక్షం రాదు.
→ ఆత్మైక్యబోధన = ఆత్మ యొక్క ఏకత్వము యొక్క జ్ఞానము, వినా = లేకుండా,
విముక్తి: = మోక్షము, బ్రహ్మశతాంతరేపి = వంద (బ్రహ్మల ఆయుర్దాయము
నందు కూడా, న సిద్ధ్యతి = సిద్ధించదు
→ మోక్షం సిద్ధించాలంటే మీరు ఆత్మ స్వరూపాన్ని తెలుసుకోవాలి. (మనస్సు
ఇంకోమాట కూడా వేసారు - ఐక్య = ఏకత్వం. ముక్కలు లేని అది ఐక్యత.
నీరు ఐక్యత - చెరువు, కుంట, మేఘం, సముద్రం. ఇన్ని ఉన్నప్పు చాలామంది
పొరబడతారు. కుండలో నీరు ఎందుకు పనికిరాదు, గంగలోనీరు గొప్పదిలాగ అనుకుంటారు
శ్మశానంలో అగ్నికి, యజ్ఞశాలలో అగ్నికి తేడా లేదు. లోకంలో ఒకటి పవిత్రం
మరోకటి అపవిత్రం అని చెప్పుతారు మాత్ర విభాగం చేసి పెట్టారో చూడండి.
→ ఈ రకంగా మనుషులు ఏం చేసేవంటే ఐక్యంగా ఉన్న ఆత్మని ముక్కలు చేసి
పెడతారు. ఆ అజ్ఞానాన్ని పోగొట్టి ఆ ఏకత్వం, అది ఐక్యత అని తెలుసుకోవాలి
Eg:- దేవుడు ఒక్కడే, మరి దేవాలయాలలో అనేకంలా కనపడుతుంది. నగలు
అనేకం బంగారం ఒక్కటే, కుండలు పిడతలు అనేకం మట్టి ఒక్కటే. అలాగే దేహాలు
అనేకం, ఆత్మ ఒకటేనే. అది ఆత్మైక్యం అంటే. ఇంకో ఐక్యం కలదు దేవుడువేరు,
ఆత్మవేరు కాదు. ఏది దేవుడో అదే ఆత్మ. ఏది ఆత్మయో అదే దేవుడు ఇది
ఐక్యం, ఆత్మైక్యం ఇది మీరు తెలుసుకోవాలి. అప్పుడు మనం శాస్త్రంలో లోతుల్లోకి
slow గా అడుగు పెడుతున్నాం
→ మీ హృదయంలో ఏ చైతన్యం కలదో, అదే చైతన్యం సకల ప్రాణుల హృదయం
యందు కలదు - ① 2వ రకం ఐక్యం అదే చైతన్యం పరమాత్మ. అటువంటి ఐక్యం
ని మీరు తెలుసుకుంటే (అనుభవం లోకి తెచ్చుకుంటే) మీకు మోక్షం లభిస్తుంది. మీరు
Maths class లో ఉన్నారు. కానీ తెలియుట అనేటువంటి యొక్క పరమలక్ష్యము
ఆచరణ చేసినప్పటికే తెలిసినట్లే జీవం వస్తుంది. Eg:- Surgeon, Nurse

→ భజంతు అంటే ఉపాసన, యజంతు అంటే కర్మ. వాటికంటే జ్ఞానం గొప్పది. జ్ఞానం వలన మోక్షం వస్తుంది. జ్ఞానం లేకుండా మోక్షం వచ్చే అవకాశం ఏమన్నా ఉందా? (బ్రహ్మ ఆయుర్దాయానికి 100 రెట్లు కర్మలు చేసినా మోక్షం రాదు
Eg: పాయసం తిందాము అని భజన ఎంతసేపు చేస్తే ఆకలి తీరుతుంది?

→ కాబట్టి ఆత్మ స్వరూపం, దానికి పరమాత్మకి భేదం లేదు అన్నది. ఒకే ఆత్మ సకల ప్రాణులలో ప్రకాశిస్తున్నది - అన్నది, ఈ ఐక్య జ్ఞానం లేకుండా మీరు కర్మలు ఉపాసనలకి తీర్థయాత్రలకి దానధర్మములు కోట్లు కోట్లు సంవత్సరములు చేసినా మీకు మోక్షం కలుగదు. జ్ఞానం వలనే మోక్షం కలుగుతుంది

→ ఇతర పూర్వకమైన ఉపాసనలను, కర్మలని పక్కన పెట్టి. ఇవి చేసే time లో చేస్తారు. వాటిని పక్కన పెట్టి జ్ఞానమునకు పెద్ద పీట వేసే కార్యక్రమం మొదలైంది ఇంక ఇక్కడి నుండి వేరే చూడాలని చెప్పి, చివరి వరకు ఈ జ్ఞానం యొక్క మహిమను పదే పదే స్పృశిస్తూనే ఉంటాం

→ శాస్త్రాణి = శాస్త్రములను, వదంతు = చెప్పుదురు గాక, దేవాన్ = దేవతలను, యజంతు = పూజించెదరు గాక, కర్మాణి = కర్మలను, కుర్వంతు = చేసెదరు గాక దేవతాః = దేవతలను, భజంతు = ఉపాసించెదరు గాక, ఆత్మైక్యబోధేన వినా = ఆత్మ యొక్క ఏకత్వం యొక్క జ్ఞానం లేకుండా, బ్రహ్మశతాంతరేపి = నూరు (బ్రహ్మ) దేవుల ఆయుర్దాయం నందు కూడా, విముక్తిః = మోక్షము, న సిద్ధ్యతి = సిద్ధించదు

→ ఈ శ్లోకంలో రెండు point లు ఉన్నాయి. (1) జ్ఞానము (2) ఆత్మ ఏకము

అమృతత్వస్య నాఽఽశాస్తి విత్తేనేత్యేవ హి శ్రుతిః ।
బ్రవీతి కర్మణో ముక్తేరహేతుత్వం స్ఫుటం యతః ॥ 7 ॥

→ అమృతత్వస్య, న, ఆశా, అస్తి, విత్తేన, ఇతి, ఏవ, హి, శ్రుతిః, బ్రవీతి, కర్మణః, ముక్తేః, అహేతుత్వం, స్ఫుటం, యతః

→ ఏమండీ మీరు కర్మలన్నీ అలా పక్కన పెట్టేసారు ఎందుకలాగ? అంటే చెప్తున్నారు. యతః = ఎందువలన అనగా, అమృతత్వస్య = విత్తేన = ధనముతో, అమృతత్వస్య = మోక్షం యొక్క, ఆశా = ఆశ న అస్తి = లేదు. ఇతి = అని, శ్రుతిః = శ్రుతి, కర్మణః = కర్మకు, ముక్తేః = మోక్షమునకు

అమృతత్వస్య = కారణం కాకుండటను, స్పష్టం = స్పష్టంగా, హ : నిశ్చయం
ప్రవీతి = చెప్పుచున్నది

→ ఇక్కడ ఈ "అమృతత్వస్య నాశాస్తి విత్తేన" అనేది Quotation బృహదారణ్యకోపనిషత్ నుంచి వచ్చింది.

యాజ్ఞవల్క్య మహర్షి, ఎందుకని సన్యాసం? అంటే ఆయన మోక్షం కొరకు. ఇంత సంపద వల్ల మోక్షం రాదా? అంటే సత్యం చెప్పాడు. సొమ్ముతో కర్మలు చేయొచ్చు, జ్ఞానం రాదు. డబ్బుతో మోక్షం కలగ అని లేదు "విత్తేన అమృతత్వస్య ఆశ నాస్తి" అని ఖచ్చితంగా ఆయన చెప్పిన వచనముల అర్థం ఏమిటో తెలుసా "కర్మ మోక్షమునకు హేతువు కాదు" అని చెప్పారు. విత్తం అని చెప్పాడు కదా అంటే విత్తంను ఉపయోగించి మీరు కర్మలను చేస్తారు. ఆకర్మల వల్ల మోక్షము రానేరాదు. Eg:- Business people- కొంత డబ్బు వెంకటేశ్వర స్వామికి donation.

→ ఆ ధోరణి అలా ఉంటుంది, ధనం తోటి అద్వారా మనం చేసే కర్మల తోటి మనం మోక్షం పొందగలుగుతామా అనే ధోరణి కొంత ఉంటుంది సమాజంలో.

→ ఇక్కడ స్పష్టంగా చెప్పినారు. కర్మల వలన మోక్షం వచ్చే ప్రసక్తే లేదు. అందువలన జ్ఞానం తప్ప మోక్షంకు మరొక హేతువు లేనే లేదు. కర్మలు కానే కాదు అని మనం స్పష్టంగా నిర్ధారించవచ్చు

→ ఈ ప్రతిపాదనము కొంత గంభీరమైన విషయం. మామూలుగా లోకంలో ఉండే వ్యవస్థ తరువాత దేవాలయాలు పూజలు, దానాలు, ధర్మాలు ఆ వ్యవస్థకి విలక్షణంగా ఉంటుంది

→ ఇక్కడ మనం కోరేది ఏమిటంటే మోక్షము, అమృతత్వము. మామూలుగా మనం దేవాలయాలలో ఎక్కడికో వెళ్ళినప్పుడు అప్పుడు జనం ఏది కోరుతుంటారు? డబ్బు, భోగాలు, మహా అయితే పుణ్య లోకం. అమృతత్వం, మోక్షం అనేటువంటి మాట మనకు ఎక్కడా వినపడదు. సంకల్పాలలో కూడా అలా ఉండదు. కానీ ఎవరో కొద్ది మంది ఉంటారు. వాళ్ళు ఈ ఇహ పర లోకములలో జీవనం, అది ఎలా ఉంటుంది కాల ప్రవాహంలో సాగుతూ ఉంటుంది. ఓ రోజు సుఖం మరో రోజు దుఃఖం అలా పోతూ ఉంటుంది తరువాత జన్మ, మృత్యువు మధ్యలో జీవితం చాలా కష్టాలతో నిండి ఉంటుంది. సుఖ దుఃఖముల ప్రవాహానికి అలవాటు పడిపోతారు. జీవితం అంటే ఇంతే కాబోలు అని అనుకుంటారు. వాళ్ళల్లో కొంత

ఎక్కువ సుఖాన్ని పొందటానికి, దుఃఖమును కొంత దూరంగా పెట్టటానికి ప్రయత్నం చేస్తారు. ప్రయత్నం అయితే చేస్తారు గాని ఆ ప్రయత్నం ఏమీ ఫలించదు సుఖ దుఃఖముల ప్రవాహమే సాంతం ఉంటుంది. ఇక్కడ ప్రశ్న ఏమిటంటే ఈ సుఖ దుఃఖముల ప్రవాహం నుండి విముక్తి సంభవమా. Is it possible? అని ఒక ప్రశ్న ఇది short range ప్రశ్న అంటారు. long range ప్రశ్న ఉన్నది అదేమిటంటే ఈ పుట్టుక, చావు. ఇది long range. ఈ జన్మ మరణ ప్రవాహం నుండి విముక్తి గలదా? అని ఇంకో ప్రశ్న. ప్రశ్నలు రెండు సమాధానం ఒక్కటే. ప్రతి నిత్యము మనం అనుభవిస్తూ ఉండే. సుఖ, దుఃఖ ములకు అతీతంగా తన స్వరూపం నందు తను ఏమిటో తెలుసుకొని దానియందు నిలిచి ఉండుట ద్వారా ఈ సుఖ దుఃఖ ప్రవాహమునకు మనం అతీతంగా పోగలుగుతారు. దానికే మోక్షం అని పేరు విముక్తి.

→ ఈ పుట్టుక, చావు. దీనికి అతీతంగా మనం పోవచ్చును. సంభవము. దానికి అమృతత్వము అని పేరు. short range ని దృష్టిలో పెట్టుకొని మోక్షము, long range ని దృష్టిలో పెట్టుకొని అమృతత్వము. అమృతత్వమే మోక్షము ఇవి కావాలి అనేవాళ్ళు చాలా తక్కువ మంది ఉంటారు. చాలా అరుదుగా ఉంటారు. Eg: ఎవరో BSc fail అయి డబ్బుగా చేసుకునే వాడు ఉంటాడు తప్ప MSc, PHD చేసేవాళ్ళు తక్కువ. ఇది అలాంటిది

→ యాజ్ఞవల్క్య మహర్షి, ఆయన ఐశ్వర్యములు నిండా ఉన్నవాడు. అట్లా ఆయన అమృతత్వమును కోరి సన్యసించబోతున్నప్పుడు భార్య సంపద వల్ల అమృతత్వం వస్తుందా అడిగే రాదు. కాని డబ్బులతో కర్మని చేయవచ్చు. కర్మలతో పుణ్యం వస్తుంది పుణ్యంతో మనం స్వర్గాన్ని పొందవచ్చు అవన్నీ సంభవమే కానీ అమృతత్వము, మోక్షము అనేది (freedom/liberation/immortality) మాత్రం డబ్బులతో వచ్చేది కాదు అని ఆయన చెప్తారు.

→ విత్తేన = సంపదతో, అమృతత్వస్య = అమృతత్వమునకు, అనగా మోక్షము నకు, ఆశ = ఆశ, నాస్తి = లేదు. డబ్బులతోటి మోక్షం వస్తుందనే ఆశ మాత్రం లేదు. డబ్బుగాని, ఆ డబ్బులతో వచ్చేటి కర్మగాని Eg: దాన ధర్మాలు — కీర్తి, పుణ్యం, స్వర్గం — ఇవి మోక్షం మాత్రం లభించదు

ఇతి = అని, శ్రుతిః = శ్రుతి, హి = నిశ్చయముగా, బ్రవీతి = చెపుతోంది
యతః = ఏలయనగా, ముక్తేః = మోక్షమునకు, కర్మణః = కర్మ, అహేతుత్వం = కారణము కాదు అని స్ఫుటం = స్పష్టమగుచున్నది

→ కబట్టి కర్మ వలన మోక్షం ఉండదు అది ఒకటి settle అయిపోయింది మీకు కావల్సింది మోక్షం అయితే మట్టుకు అది కర్మ వల్ల రాదు. మీకు స్వర్గం కావాలి. అంటే మీరు దానికి తగ్గ కర్మ ఏదైనా చేసుకోవచ్చు. మోక్షం కావాలంటే మాత్రం కర్మల వలన అయేది కాదు. మరి దేని వలన అవుతుందంటే జ్ఞానము

→ మరి భక్తి అని ఒకటి ఉంది కదా అంటే అది కూడా జ్ఞానంలోకే పోతుంది

## జ్ఞాన ప్రాప్తి కి ఉపాయము (8 to 13)

అతో విముక్త్యై ప్రయతేత విద్వాన్
సంన్యస్త బాహ్యార్థ సుఖస్పృహః సన్ ।
సంతం మహాంతం సముపేత్య దేశికం
తేనోపదిష్టార్థ సమాహితాత్మా ॥ 8 ॥

→ అతః, విముక్త్యై, ప్రయతేత, విద్వాన్, సంన్యస్త, బాహ్యార్థ సుఖస్పృహ, సన్, సంతం, మహాంతం, సముపేత్య, దేశికం, తేన, ఉపదిష్టార్థ సమాహితాత్మా

→ విద్వాన్ = తెలివైనవాడు, తెలిసినవాడు. ఇప్పుడు జీవితంలో ఒక మార్గాన్ని చూసుకున్నాడు, ఈ మార్గం ఎవరికీ చేకూరదు ఇది, తెలిసినవాడు మాత్రమే ఈ మార్గాన వెళతాడు. ఉపనిషత్ పాఠం చెపితే ఎంత మంది వస్తారు! ఎవడో తెలిసినవాడు, ఒకడు వస్తాడు. అందుకని విద్వాన్.

అతః = అందువలన, ఇందువలన అంటే ఎందువలన? "కర్మ వలన మోక్షం లేదు గనక", అనగా విద్వాన్ = తెలిసి ఉన్నవాడు, విముక్త్యై = మోక్షము కొరకు ప్రయతేత = ప్రయత్నము ను చేయవలెను. కాబట్టి, ఏమైనా తెలివితేటలు మీకు ఉన్నట్టయితే మీరు ఏవో కర్మలు చేసి పుణ్యాన్ని పోగేసే ప్రయత్నం, మానేసి ఆ మోక్షం కొరకు ప్రయత్నం చేయాలి.